అష్టాదశ పుష్పము

ఆనందాశ్రమము

# శ్రీ సర్వేశ్వర శతకము

భగవద్భక్తులును; ఆధ్యాత్మిక చింతనాపరులును
దేవద్విజగురు సేవాపరాయణులు నగు
**శ్రీ గెంబలి శ్రీరామమూర్తి శ్రేష్టిగారి**
ధన సహాయమున ముద్రితము.



రచన:

## సరస్వతుల సోమేశ్వరశర్మ

ఆ న ం దా శ్ర మ ము-        అ ష్టా ద శ పు ష్ప ము

# శ్రీ సర్వేశ్వర శతకము



భగవద్భక్తులును; ఆధ్యాత్మిక చింతనాపరులును

దేవద్విజగురు సేవాపరాయణులు నగు

శ్రీ గెంబలి శ్రీరామమూర్తి శ్రేష్ఠి గారి

ధన సహాయమున ముద్రితము.



ర చ న:

సరస్వతుల సోమేశ్వరశర్మ

పింగళినామ చైత్ర
శు క్ల ఏ కా ద శి



500 ప్ర తు లు.

వె ల : రు.

ము ద్ర ణ ;
శ్రీనివాస ప్రెస్, తేది..
రాజమహేంద్రవరం - 1

ప్ర చు ర ణ ;
గెంబలి శ్రీరామమూర్తిగారు
(ము ద్ర ణ దా త.)
తూనికలు, కొల్తలు వ్యాపారము
చినబజారు, బొ బ్బి లి (532558)



శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# శ్రీ సర్వేశ్వర శతకము

శ్రీ మంతంబును, ఆద్యమై, పరమమై-చేతోముదంబై; వినా
నామంబై, గుణరూపశూన్యమయి, నానాజీవరూపంబునై,
ఏమైయుండక, నన్నియున్నగుచు నిర్లేపించు-బ్రహ్మంబవో
స్వామీ! నీవనిదల్తు సంతతము స్వాత్మాంతాన సర్వేశ్వరా!

సతతంబున్ భవదీయదివ్యమహిమన్ సాంగంబుగాశ్రద్ధతో
స్తుతియింతున్, వ్యథబుచ్చకాల మికనన్ శోధింపగాబూన కే
స్మృతి నీపై నిడు బల్మినిమ్ము, నినునే చేమోడ్చి ప్రార్థింతునా
గతి నీవేయని నమ్మినాడ నిది నిక్కంబయ్య సర్వేశ్వరా! ౧

కనుచూపానిన యంతనట్టు నినుకాంక్షన్నే విలోకింపగా
కనువా మార్గము చూపుమయ్య! మదిలో వంతస్థితంబైన నీ
ఘనరూపంబును తల్చుచున్ విడువలేకన్ ధ్యాననిష్ఠుండనై
మనగా జేయవె దేవ! వందనము గొమ్మా! నమ్మి, సర్వేశ్వరా!

సర్వాత్ముండవు నీవటంచు హృదినే చర్చింపగా నేమియా?
సర్వంబందున నిన్ను, నీదు మది నా సర్వంబు దర్శించి నే
నిర్వేదంబున నుంటనేలుకద! నిన్నేయన్నిటన్ జూచు నా
కుర్వీన్ జోడగు వారలుందురె? అగణ్యోదార! సర్వేశ్వరా!

ఏనో ఆశలు నా హృదిన్ నిలచి ప్రత్యేకంబు తత్సిద్ధికై
యీవిశ్వంబందున కాలమెల్ల వృథగా యేబుచ్చుచున్నాడనా
ప్రావీణ్యంబు నశించె, దేహము రుజాక్రాంతంబుగాజొచ్చె,నిం
కీవే నాకికదిక్కు, నీకరము నందిమ్మింక సర్వేశ్వరా! ౫

ఇది నీతల్లి, యితండె తండ్రి, యిది నీ యిల్లాలదే సోదరుం,
డది నీచెల్లెలు, మిత్ర బాంధవులు వారంచున్ నెరింగింపగా
నదలో వారలపై మమత్వముగ నాకీబంధునే యుండగా
నదరేలా!యని సూక్ష్మతన్ దిరుగుదేనయ్యయ్యో! సర్వేశ్వరా!

ధనముల్ సౌఖ్యములున్ సుతాదులును నానాభోగభాగ్యములు
నిను గోరన్ సమకూర్తు వొక్కత్రుటిగా నీనిచ్చ జూడంగ,పా
పనష్టా తావక పాదసేవ సలుపన్ వాంఛించు భక్తాళికా
ర్తిని దారిద్ర్యము కూర్తు వేల! నిదియేలే దేవ! సర్వేశ్వరా! 7

నీ కారుణ్యముచేత లబ్ధ విభవానేకంబుచే మత్తులై
లోకంబందున దుర్మదాంధతను, స్వారోపానల ,జ్వాలలన్
మాకెగ్గుల్ సమకట్టు ,పుత్రులము సుమార్గమమ్ము గారించుటే
యాకాంక్షింతువ ? దుష్టులిష్టులటరా? హా దేవ సర్వేశ్వరా

ధనమర్థించెడివాడు, జ్ఞానియును నిన్ ధ్యానించు భక్తుండు వే
దనలన్ కుందెడువాడు వేరె మతిలో-దర్శింప నిన్గోర్తు రం
చును పెద్దల్ వచియింప వింటి, నీ- శుంభత్కృపావాప్తికై
నినునర్చించుటలేదొ, నన్ను మరువన్-నీకేల? సర్వేశ్వరా.౯

కరుణామూర్తివి, భక్తలార్తివశుడై, కావన్ మరెవ్వారు నీ
కరమందింప మటంచు నేడ ...

సరి నే భక్తుఁడఁగానొ, నిన్ను మది నశ్రాంతంబు ధ్యానింపనో
దరహాసంబొలికించు నిన్ను గనని ధన్యుండ సర్వేశ్వరా. ౧౦

ధనముల్ గోరను, వాహనంబు లడుగన్ తత్పాదయుగ్మంబె నే
నను నిత్యంబు హృదిస్తుదించి సుమతన్ త్వద్ధ్యానపూజాది క
ర్మను సేయంగల స్థైర్యమిచ్చి నను సమ్మానింపరా! అన్యమి
మ్మని వేధింప, నుపేక్ష సేయకు, కృపన్ మన్నింపుమ సర్వేశ్వరా

ఏనాఁటి జన్మల పుణ్యకార్య ఫలమో యీనాఁడు ప్రాపించె నా
కన్నా! యీ నరజన్మ, నీపదములం దాసక్తియున్ గల్గె, నా
పన్నత్రాణ పరాయణుండవుగదా భక్తిన్ ననున్ సాఁకు, లే
దన్నా నిను గొల్వ రెవ్వరిది సత్యంబయ్య సర్వేశ్వరా 12

కావ్యంబుల్ పఠియింప, శబ్దముల నే కాలంబు వల్లింప, సు
శ్రావ్యంబైన ప్రబంధపాఠనము లేశంబైన లేదయ్య సం
భావ్యుండన్న గుదెట్లు లక్షణపుత్రోవల్ జూడకే? నైన నే
నవ్యాజంబగు తావకీయ కరుణా హ్లాదంబునన్ జేయుదున్
భవ్యంబైన భవన్నుతిన్ గొనవె విశ్వారాధ్య! సర్వేశ్వరా!

సభలన్ మాన్యత బొందగా, కవిగరిజ్ఞానుల్ ప్రశంసింపగా
ప్రథితన్ పేరును పొందఁజేయనిది సర్వాంతర్యముల్ గాంతువీ
వర్ణవ్యా! నాదు మనోహరిన్ తవపద ధ్యానాను సక్తంబుగా
శుభదన్ జేయుము, నానుతిన్ గొనుము, విజ్ఞున్ జేయు సర్వేశ్వరా

భక్తి, నీతిపారలి జగమునం దెవ్వారు, వాత్సల్యమే
వ్యక్తి తాత భరతస్నామయమున నీ కేనాడు కత్రిత్యతా

ధీరత్వంబులు కల్గునే! సమతగాదే నీ స్వరూపంబు, లో
కారాధ్యుండవు, వందనము గొనుమయ్యా దేవ! సర్వేశ్వరా,

కనులన్ జూడగలేదు నిన్ను నెటులే కల్పింతు నీ రూపు! నా
మనమందెట్టి గుణుండవంచు నిను సంభావింతు, వస్త్వాక్త భా
వన సేయంగల నెల్లు నిన్ను జగమై భాసింతు వీవన్న, పె
క్కును నెట్లొక్కటిగన్ దలంప నగు నాకున్ దేవ! సర్వేశ్వరా

సిరియున్ సంపద దేహదార్ఢ్యములు నీ చేకొంది, నీవైన యీ
నరపశ్వాది సమస్త జీవులకు నానందంబు నే గూర్చుటల్
మెరుగన్, నాగల దన్న లేదెప్పుడు, విశ్లేషాంబుగా నన్యతన్
తరిగెన్ నాదగు కాలమంతయును, సత్యంబయ్య! సర్వేశ్వరా!

ధనమున్నన్ పనిలేదు, భారమగు నిత్యంబు తద్రక్షకై
ననయంబాత్మను శాంతిబాసి తిరుగాడజాలరా! నీవె నా
కనువా తావక పాదపద్మయుగళీ - ధ్యానామృత స్వాదనం
బొనగూడన్ కృపజూడు, ధన్యుడిదియే-లో దేవ! సర్వేశ్వరా?

తనకిష్టం బొనగూడునంత నరకే తప్పంగి చింతన్ వసిం
చును, నీకో, మది దల్చుమాత్రము నవిచ్చోటన్ పకుల్ పొందజా
లని యానందము గూర్తువెల్లపుడు, మేలా నాకు నీభావనా
మననాదుల్ విడనాడ, నీతలపు విమ్మా దేవ, సర్వేశ్వరా,

కనులన్ జూచినదెల్ల నీవనుచు, నేకార్యంబు నే జేసిన
న్నిను బూజించుటగా దలంచి మదినిన్నే నిత్యమత్యంతమున్
అనుసంధానము సేయు బల్మి నిడుమా, నాకన్య మొండేమికో
రను లేదయ్యా, భవత్పదంబు లిటు తే రాగాల్తు, సర్వేశ్వరా,

పగవారెవ్వరు నాకు సర్వమును నీవై యుండ, నే నెవ్వడన్
బెగడేలా. అది కూర్మి బుద్ధియను మన్ నేడంగ నేలా నినున్,
అగు దేనన్నియు. నన్ని యౌన. విదితత్వంబైన విభ్రాంతిచే
దగ ద్వంద్వస్థితినుంటి, గిరి విభుగన్ తత్వంబు సర్వేశ్వరా! 21
ఇది నాకిమ్మని యూయ నేయును మనే నెవ్వారలన్ గోర, నా
కెదు రేమున్నది, పొందరాని దొకటే నెందైన లేదయ్య! నా
మదిలో దల్చినరాత్రి నిల్చి నెమ్మున్. భ్రాంతుండనై గాదె కో
రుదు, విభ్రాంతిని వీడి నేను గనుచేర్తున్ నిల్వ సర్వేశ్వరా! 22
నే నెవ్వాడను? నీవు నెవ్వడవు? నే - నీవాడ నీ నేన, లే
దేనాడైనను నీవు నను రెం - డీనాడు నేనాకకే
నే నీ సత్యము గాంచినాడ. హృది దీ- నిన్ సుస్థిరత్వంబుగా
పూనంగాలిని నిర్వికారుడను గా పూజ్యుండ, సర్వేశ్వరా! 23
నేనన్నంత నె నీవనావలసె, నా - నీ రెండు లేకున్నచో
గానేరాదు విభేద, మీ జగము దే - లా నిల్చు! విశ్వంబులో
నానాత్వంబు వెలుంగు విశ్వనుడగున్ - దానంత నేకస్థితిన్
ఆనందంబొక టే స్థిరంబగు, నదే - నాదయ్య! సర్వేశ్వరా! 24
సామర్థ్యంబును కల్గి అర్థికిడ తా - త్సారంబు జేయన్, నినున్
తామై చేయిని చాపనేలని మహాంతంబైన ద్వేషంబుతో
నీమాహాత్మ్యము కేది మూలమది తా - నేపొందు, నీకంత పై
నేమున్నిల్చునె గౌరవంబది యహో - నేలాగు సర్వేశ్వరా! 25
కలిమిన్ లేమియు కష్టమున్ సుఖము, లోకంబందు ప్రాప్తించుచుదా
వలదన్నన్ గతజన్మకర్మ ఫలమై, - వాంఛించినన్ పొందగా

నలవేతావకపాదపద్మయుగళ ధ్యానంబునన్నిల్వ? వ్యా
కులమీచిత్తము, విస్మరించు నిను నాక్రోశించు సర్వేశ్వరా?
భవదీయంబగు రూపమాత్మనిడి నే-బ్రార్థింతు నన్నన్శృతుల్
ప్రవచించున్ నిను రూపహీనునిగ, నా-పాపంబదేమో పరా
భవమే కల్గుచునుండె నింద్రియములే- బంధించి సర్వాంబులో
ననలోకించెద నిన్నటన్న, నభయంబందిమ్ము సర్వేశ్వరా! 27
నీవాద్యుండవు శాశ్వతుండ వనుచున్ సేవింతు, లోకంబులున్
యీవిశ్వస్థిత సర్వ మీవనుచు,నం దెదాని నే నమ్మ దో
దేవా! దృశ్యము నశ్యమంచురటులే-నిన్ నిన్న విశ్వంబుగా
భావింతే విధి! నిక్క-మేది? తెలియన్-భాషింపు సర్వేశ్వరా!
కారుణ్యంబ భవత్స్వరూప మనుచున్- కారుణ్యచిత్తుండవై
యేరెద్దానిని గోర వారికది నీకెంతో ప్రియత్వంబుతో
జేరన్ జేయుదువంచు విందును ప్రభూ-చేసాపి యాచింతునా
కీరా నీపదభక్తి, చాలు, నితరం బేలయ్య సర్వేశ్వరా. 29
దినముల్ రాత్రులు పక్షముల్ నెలలు నిస్తేజంబు వ్యర్థతన్
జనియెన్, నిన్ను భజింపనైతి, భవదాసక్తుండనై ప్రీతితో
నొనరింపన్ జప దాన పూజనములయ్యో దార్ఢ్యమింతంతయై
కనుపట్టెన్ నిను జేరు మార్గమెరుగం గాలేను సర్వేశ్వరా, 30
మరణంబన్న భయంబు కల్గెడిని, వేమారిట్లు జన్మించుచున్
మరణంబందుచు నుండగావలె ననన్-మార్గంబు నెద్దానిచే
దొరగున్ పుట్టుచు గిట్టుచున్న వయుటల్ దుష్టత్వతన్ వీడి నీ
చరణం బంటిన జాలదా స్థిరత-నశ్రాంతంబు సర్వేశ్వరా. 31

ఉదయంబాదిగ నిద్రపోవుదనుకో హా హాహాశ్వతక్ స్వోదర
క్షుదచల్లార్ప శ్రమింతు,నింతియ, నినున్ శోధింపబూజింపగో
రెద నేదో యవి నోటవేయుటకు, నే -గీమాద్యశుల్ నిద్రచే
కదలున్ రాత్రియు, నాయువిట్లుగుజక్కన్ దేవ సర్వేశ్వరా.

తనయాలిన్ దనయాప్తగాంచినమ్ముల్ -ధాన్యాదులున్ భోగ
ముల్
ననువౌ మేడలు మిద్దెలున్ సుఖములత్యంతంబు చేకూర్పగా
తన కాలంబు వ్యయించు మర్మనుత నద్దానన్ సుఖంబేది? లే
దని మానుండు నినున్ దలంపడు, వ్యథాతప్తుండుసర్వేశ్వరా.

కలనాడార్జన చేసినట్టి ధనమో, కాలంబునన్గన్న పు
త్రులు లేకుండిన నానిజన్మ వ్యథ,అంతోయింత వ్యదాప్యతన్
బలమిచ్చున్ తనయుండు తండ్రికిని సద్భావంబులో, దానిచే
కలుగున్ శాంతియు. నిన్నుగొలునన్-కాంక్షించుసర్వేశ్వరా!

ఎన్నో జన్మల నెత్తియెత్తి తుదకే నీ నాడు జన్మించినా
నన్నా మూనతన్, సదా హృదిని నిన్నారాధనల్ జేసి నా
కున్నట్టి యవియెల్ల నిగు. గొను లోకోద్ధార నా కీయరా
వన్నా నీపదభక్తి శాంతిగనుదయాన్యదాన సర్వేశ్వరా. 36

ఏలా పెక్కువచింప, త్వత్పదములే హృత్సింహా పీఠంబుపై
లీలన్ నిల్పుదు చిత్సుమంబులను అర్చింతున్. సదా నీకిదే
కేలున్ మోడ్చినమస్కరించెదను, నిన్-గీర్తింతునెల్లప్పుడున్
నాలో నిన్ను స్మరించెదన్, మగతు నన్యంబింక సర్వేశ్వరా.

రా రా శావర చిత్త శాం తినిడరా-రాజ్యాది భోగంబులీ
వేరాయంచు కరంబు పట్టనుర, లే -రీరేడు లోకాలలో

నీరీతిన్ ననుజూచువారు, యిడరా - నీపాద సంసేవనా
ధారత్వంబు, మరొండుకోరనుర, వేదాధార! సర్వేశ్వరా! 37
వేలున్ లక్షలు కోటుల ద్భుదముగా . విశ్వస్థ జీవాళినే
లీలన్సృష్టి యొనర్చినావౌ కద నీ - రీతుల్ మహాశ్చర్యమై
గాంచిలున్, సాదృశమింత రూపమున లీ-లామాత్రముస్లేక. నా
కేలున్ మోడ్చి ఘటింతు నంజలిని, స్గిర్తింతుస సర్వేశ్వరా! 38
పరమాశ్చర్యంబు నీ ప్రతిభ. గర్భస్థుండు నెల్వడ్డ మా
తృ.రయంబేసనూకూర్పై వాశిశువుకున్-స్తన్యంబు, కారుణ్యతన్
తరమా వర్ణనజేయ నిన్ను! పరమా-నందంబుగాదే ప్రభో!
అరయన్ నీకును మాదు చేష్టితము లత్యంతంబు సర్వేశ్వరా
సరినారెవ్వరు నీకులేరు, జగముల్ సంకల్పమాత్రంబుచే
పరికల్పింతువు, రక్ష సేయుదువు, నీ - ప్రావీణ్యమేవారలున్
తరమే పొందగ, విశ్వశాంతియొకదా-ధర్మంబుగాజూతు, నా
దరణీయుల్ జనులెట్టివారయిన, సత్యంబయ్య! సర్వేశ్వరా!
నీచే కల్పితమైన యీజగమంతా నీలోన నేడిందు, మా
చే చేయంబడెనన్న భ్రాంతి నెగ, కాశ్వ్రమైన నాడింపగా
వాచాతీత సమర్థుడే జనుడు! నీవాంఛనుగదా కర్మచే
యున్ చిత్రింబిదికాదె, చండశాశనుచుడవి-కోయయ్య!సర్వే,
ఎచ్చోనుంటివి? ఏదినీకు నెలవో? నేరీతి నిన్జూటో?
సచ్చారిత్రులు యోగిపుంగవులు శాస్త్రార్థంబులున్ పల్కుటే
మెచ్చే! చూచిన చేరెనట్టి జనుడే మేనన్న నమ్మంగనా:
సచ్ఛీలా ఎరుగంగ జేయుమిక నీ-సత్యంబు సర్వేశ్వరా?

అయ్యో భ్రాంతినిభ్రంగిమానవుడు తానై యన్నియున్ జేయగ
నయ్యెన్, ఎంతశ్రమించి నా ననుమనత్యాయాసమున్ జెందు లే
దయ్యా! వానికిచే నసుంతగన, సత్యంబయ్య, ఎల్లప్పుడీ
వియ్యంగా నెటుదాన కర్త యనుచో నీ జీవి సర్వేశ్వరా! 43
నీవే కర్తవు, భోక్త నీవ నొకులే - దిన్ జేయగా శక్త్యలే
ప్రావీణ్యంబున సర్వమీవయిన నె - వ్వారల్ గనజ్ఞాలరీ
చేవల్, కర్తలమంచు తత్సలముకా - సింత్రంతె, చిత్రింబోకో
దేవా! కర్తనుకాను, నన్ను ఫలముల్ నిజ్ఞేర్పు సర్వేశ్వరా! 44
ధనముల్ వైభవసంపదల్ పదవి నిత్యానంద సౌభాగ్యముల్
కనుచున్నారదె, నాకు లేవని వివేకంబున్ విసర్జించి. యీ
ర్ష్యను పొక్కుచునుండి నన్ను నాతవనినిన్ ధ్యానించి ప్రార్థింపడె
ట్లనుగా వానికి శాంత? కోరకెటులయ్యా నచ్చు సర్వేశ్వరా! 45
ధనముల్ కోరను వాహనంబులడుగ సత్త్వాదయుగ్మంబైనా
మనమందెప్పుడు నిల్పికొల్చు బలిమిన్నమ్మాయమంచు బ్రార్థించెదన్
జనకా! పుత్రికవత్సలాత్మకమున న్ శాంతంబు నీదివ్యమో
హన రూపంబెదుటన్ కనుంగొనగ జేయజ్ఞాడు సర్వేశ్వరా 46
సమతన్ జూతువు తండ్రి తోడ నను, నిస్సారంబుగా బోయెగా
లము, వీక్షించి యుపేక్ష సేయుటిది మేలా! పుత్రవాత్సల్యతన్
అమరన్ జేయుము, స్వస్థునై నసుఖుడన్; అర్థించుచున్నాడనా,
సము లేరీయన శాంతిసౌఖ్యమిడరా! సర్వాత్మ! సర్వేశ్వరా 47
పరిణామంబును చెందుచుండు జగముల్ బ్రహ్మంబవౌనీవెయె
కస్థరణిన్ జెందవుమార్పు, ఎట్లిది? వివేకంబీవె విశ్వంబుగా

నెరుగఁ జేయును, విశ్వమొందునది నీ-కేలాగులోపించు, నీ
మరుగున్ జించి నిజంబు చూపుము దేవిన్ బ్రార్థింతు సర్వేశ్వరా.
ఆర్తత్రాణపరాయణత్వ బిరుదం బన్యుల్ వహింపంగనే
స్ఫూర్తిన్ గాంచరు జాలమిన్, జగములన్ బూర్ణండవై యుండి నీ
మూర్తిన్ సర్వమునందు, సర్వమును నీ మూర్తిస్వరూపంబెగా
గూర్తేతండ్రి శుభంబులార్తి యడగన్-గోవింద సర్వేశ్వరా,
మొరవెట్టున్ రొక డేడ్చునొక్కఁడొకఁడే మోతాగి పేలున్ అనా
దరణీయంబగు కార్యమొక్కఁడు సంధానించఁ జేయంగ, వే
రొకడాడున్, కనుకృత్యమున్ సలుపు కీడొందున్ సుఖంబుందును
ద్ధరణన్ పొంగును కృంగుతోడనె జగద్రంగాన సర్వేశ్వరా. 50
తనకేమున్నది యీయతోడుకొని యెద్దానిన్ గనన్వొంబడిన్
గొనిరాలేదుర పుట్టునాడు జనుచో-గొంచేమియున్ బోవ, వా
సనలే వీడక వెంబడించునను నో-స్వామీ సమర్పింతు నా
మనమే నీకు, పరాత్పరా గొనుము, సన్మానించు సర్వేశ్వరా!
నీవే నాడిది యిమ్మటంచడుగనే నీయంగలేదో త్వరన్
నీవేల్మోడ్చి వచింపు మందువటరా నేనేమి సేతున్ మానం
బీవేమో యెరుగంగరాని ద,స్థిరంబేదీ, చలత్వంబునన్
నీపై నం బించుక నాత్మ నిల్పదు, సదా- నిద్రించు సర్వేశ్వరా
అది నాదోషమటందు వేమొ జనకా-ఆత్మీయుడన్ పుత్రుడన్.
సదయత్వంబున బ్రోతువందరను నాస్వాంతంబు నీపైననే
గుదియించంగను భాగమా! స్థిరతనిన్ గొల్వంగ జేయంగదే
మదినాదోషము లెంచకయ్య నినునే ప్రార్థింతు సర్వేశ్వరా 49

ఆనాడాకరి యార్తి బాపితివి, నేనా విప్రు దారిద్ర్యమున్
దీనత్వంబును బాపి తేర్చితివి, ప్రాథేయత్వమున్ జూపి నా
మానంబున్ పరిరక్ష సేయు మన మార్త్యాటల్ వచింపంగ లే
దే నాడో యననేల? నేడు ప్రాపునయి నన్గివించు సర్వేశ్వరా?

ఫలమో, పుష్పము పత్రమో జలము, సద్భక్తిన్ సమర్పించి చే
తులు జోడించి, నమస్కరించి, నినుముగ్ధుల్ మూటగట్టొక్కడేన్
నలుసున్ దేవ! నెయిసంగుమాతనికి నానందంబుగా నాయువున్
కలుగన్ జేయగ లేదుగాని జడులై శాంతింప డాత్మస్థితిన్
నిలుకన్ స్వైర్యమనుగ్రహింపుమనుచున్ నిన్నాడు సర్వేశ్వరా!

శిలయో దారువో లోహమో మలచి యిస్సీదానినే దేవుగా
దలపోయున్ మధు రాన్నముల్ ఫలములున్ దధ్యాదికబిచ్చి పూ
జలు సేయున్ అవి యే ప్రసాదమని తాసాపాటు జేయున్ కుదా
కలితుండై పసుడేడ్చినన్ ఒసగలేకన్ మూల్గు సర్వేశ్వరా! 56

పశుపక్ష్యాది సమస్త జీవులను లే - వా నీవు దేవా! భవ
ద్వశమై చిత్త మెసంగ నిల్పక వృథా - వ్యావృత్తి నేగుందు దే
దశగల్పింతువా? తావకాంఘ్రియుగళి - ధ్యానంబు నాకిచ్చిపై
కశలంబాదు సహింతు గాంతునినుగా గన్వాని సర్వేశ్వరా 57

పరమాన్నంబులు తృప్తిదీర తిని లేవన్, భాగ్యహీనుండు, ఓ
గిరమిండో గిర మాకలాకలనుచున్ ఖేదంబులో గూయగా
నరుడయ్యోవిని, యీసడించి, మెతుకైనన్ రాల్ప కేపొమ్మనో
అరతేలా! యని వెంటబెట్టు, నిదియన్యాయంబు సర్వేశ్వరా 58

కలిమిన్ బొంది, సుఖంబు, మాన్యత, విశోకత్వంబు, బంధుప్రజా
బులకోలాహలమూర్జితంబు కలుగన్ మోదించి మూఢుండు తా
తలపం డొక్కక్షణంబు నిన్ను మది నిత్యంబవ్వి రాకంచ యో
కలగున్ దిట్టును నిన్ను పోసవియ శోకంబంది సర్వేశ్వరా!
మంచో, చెడ్డయొ, యెవ్వరేదగత జన్మంబందు కాంక్షించి యో
చించే బల్మినిబట్టిగాదె, సుఖమో, చింతో దరిద్రంబో, పొం
దించున్ ఆవిధినేడు ఏలనొరు నిందింపంగ, సంప్రాప్తమౌ
కొంచెంబేని నివార్యమే కుడుమటన్-క్రుంగద్ది సర్వేశ్వరా!60
శమమాదిన్ గల భూరి సద్గుణము లీశా! లేవు నాలోన. నా
దము లేచేయుచునుందు శుష్కముగ సత్సాంగత్యమా లేదునీ
క్రిమమెట్లే నెరుగంగవచ్చును? ధనతాకృష్ణాతాదృక్కులన్
భ్రమ పోగొట్టుచు నీపదాంబుజము గొల్వఁజేయు సర్వేశ్వరా
జపముల్ జేసిన కన్నుమూసి, నిను పూజల్ చేసి మోదింపగా
నెపుడే నెంచిన, నీనుతుల్ చదువుచున్ ఏవేళ నేనున్న స
త్కృప దేవా! ఎదురన్ వసించి నిలుమా కీర్తింతు నిన్నింక, నీ
యపురూపంబగు రూపు జూపుమది-నేరిచ్చింతు సర్వేశ్వరా!
చదువుల్ నేర్వగవచ్చు నీల్గుదనుకన్ - శాస్త్రార్థ సారంబులన్
హృత్ భద్రంబుగ నిల్పవచ్చు, సభ నెంతే మెప్పుబొందంగనౌ
సదయా! నిశ్చలరుగంగ, నిగ్గనగ నిస్సారంబు లీయన్ని నా
యెదుటన్ తోచితో లంగకుండుమది ధ్యే-నిచ్చింతు సర్వేశ్వరా!
పాత్రాయామము నభ్యసించి పవనున్ పైకూర్ధ్వమార్గంబుగా
త్రాణన్ షట్కమలంబులందు నిలుపున్ ధన్యుండు, సచ్ఛాంతికే

కాణాచయ్యది.బాహ్యవిస్మృతియుసాక్షాదాత్మసంస్థానమున్
పాణిస్థామలకంబు భాతియగు సర్వాధార! సర్వేశ్వరా! 64

గురుపాదంబులనాశ్రయించి, నినుగన్గొంగల్గుమార్గంబు సా
దరతన్ జెప్పగ జిక్కబట్టి, మది న - న్యంబున్ విసర్జించి,సు
స్థిరతన్ నిన్నటనిల్పి యాత్మరమతన్ చేతంబుకోదాక నీ
ధర సంచారమొనర్చి వత్తుదరికిన్ - తథ్యంబు సర్వేశ్వరా 65

నను నిందించిన చేయరానిదిదియే - నాడున్ కటాచేసినా
వని శిక్షించిన విజ్ఞతన్ మెలగినావా హార్షమాయెన్గదా
యని యగించిన, నాదుధర్మము నె నిత్యంబే సనుష్ఠింపగా
నను వా ధైర్యము స్థైర్యమీయుము ప్రభో! అర్థింతు సర్వేశ్వరా

ఏదీ ఎంత ధనంబు గూర్చితివి! ఏ - మేమిన్ విలాసాగ్ర హూ
వేదుల్ పాదులుగూర్చినావ! నిధులే వీలేవ! లేకున్న నీ
చా దేలా! నినుజచ్చుదాక నెవర - బ్బాచూతు,రొండేడకో
పో! దాస్యంబిటు రిత్త సేయరెవరన్ పూబోడి సర్వేశ్వరా! 67

ఎవరేమన్నను పొంగ,కృంగ సమతన్ - యీజీవితాంతంబుదా
క వివేకంబు దొరంగకాత్మ నినుజక్కన్నిల్పి నీచింతనా
ది విశేషంబుల శేషజీవితము శ్రీ - తిన్ బుత్తు, నిశ్శంకతో
నవలోకించెద నిన్నె అంత్యమునన - త్యంబయ్య! సర్వేశ్వరా

చరమశ్వాసము దాకదృష్టియదువంశ శ్రేష్ఠు శ్రీకృష్ణుపై
పరమప్రీతిని నిల్పి, మూర్తి నెదలో బంధించి చేరంగ నె
వ్వరికిన్ దుర్లభమైన దివ్య పదమబ్బన్ సందు, మత్పూర్వ స
త్కారణంబెట్టిదో సుస్థిరత్వమిది నన్గాపాడు సర్వేశ్వరా 69

కలదయ్యా! యొకకాంక్ష నామదిని నీకారుణ్యతా దృక్కులన్
తొలగన్ జేయుము నామహౌఘములు కన్దోయిన్ భవద్దివ్యమం
జుల పాదంబుల దాకి, మ్రొక్కి నినునే జూడంగ జేయంగదే
తలతున్ జన్మము సార్థకంబనుచు సత్యంబయ్యా! సర్వేశ్వరా 70
కరుణామూర్తివి నీవు, నన్నుకృపతో గావన్గదా గూర్చినా
వరయన్ నీదగుభక్తులన్ గలియగా నాశ్చర్యమూ యెవ్విభో!
పరమాత్ముండవు నీవెరుంగనిదినిక్కంబెందు లేదయ్యా! ఏ
వెరవజ్ఞుండను నేర్తు నిన్ను దేలియన్ ఏనింక, సర్వేశ్వరా 71
లలితంబై, కమనీయమై మధురమై ద్రాక్షారసంబట్లు నీ
పలుకుల్ భావనసేయ, సేయహృదయంబందీవు గాకన్యముల్
మలచన్ సాధ్యముకాదు, విస్మయత నామాటన్ హరించన్గదే
కలుగన్ జేయుము నీదుమూర్తి గనుగో గానాకు సర్వేశ్వరా 72
నిన్నే దల్చుచు నీదురూపుమదిలో నిత్యంబు సేవించుచున్
నిన్నే కీర్తన జేయుచున్, తవకథల్ నిత్యంబు నేలించు. నీ
కన్నన్ అన్యులవిస్మరించి తుది లోకంబందు ధన్యుండు నా
కన్నన్ లేడన నీపదంబుగని, ఐక్యంబౌదు సర్వేశ్వరా! 73
పరులన్ దూషణ జేసి వారిమనమప్పా!కుంద నానందమే
వేరవేగాంచెద! నాకులేరు పెరలీ విశ్వాన, సర్వంబునీ
కరణిన్గన్పడు నాకు, నీకెపుడునే కష్టంబు గల్గింతునే!
కరముల్ మోడ్చినుతింతు గాని,ననుసాకన్జూడుసర్వేశ్వరా 74
కలదే పొందగరాని దేదియును నీ-కారుణ్యమేయున్న, నా
పలుకాహ్లాద మొనర్చునట్లు పరుషత్వంబున్ కఠోరంబుగా

కలరం జేయుచు సర్వమానవులకే - నానందమున్ గూర్పగా
బలమిప్పించుము, దుష్టభావమడపన్ బ్రార్థింతు సర్వేశ్వరా 75

ధరణిన్ పుట్టినదాది నేటిదనుకే నాడున్ ప్రలోభంబుచే
దిరుగన్లేదిది నీవెరుంగుదువు, ప్రీ - తిన్ జేతు నీపూజ, సుం
దరమైనట్టి భవత్స్వరూప మెదలోనన్ నిల్పగా స్థైర్యమే
కరవౌచున్నది, నిశ్చలత్వమిడి న - న్గాపాడు సర్వేశ్వరా 75

చిరుప్రాయంబునబోయి క్రైస్తవుల చర్చిన్ ప్రార్థనల్ జేసితిన్
పరిశీలించితి వారి గ్రంథముల న - వ్యాఖ్యేయ సద్గోష్ఠులన్
పరమప్రీతిని బాలుగొంటి, నయినన్ ప్రాప్తింపలేదెందు క్రొ
న రుచుల్ సూక్తులు. నిన్నెతల్తునని - త్యంబేను సర్వేశ్వరా

నిపుణున్ విష్ణువు శక్తి క్రీస్తుమునియే - చిహ్నంబు గై కొన్న నీ
కవి భిన్నంబులు కావు, సర్వమును నీవంచున్ గనుంగొంటి, కా
నని యట్లంచును వాదులాడ సరియా, - ఆత్మీయ చిత్తంబులో
నెవరెవ్వానిని నిల్పిగొల్వనది నీ వేకావె సర్వేశ్వరా! 78

గడచున్ బాల్యము ప్రాయమేగును జరా - క్రాంతంబునౌ మేను కా
లుడు దాపై నడయాడు, దుర్భరము రోగంబులన్ గుందు, గా
ఇడు నీపాదములే శరణ్యమని, కానండంతకున్, పొట్టకై
పడయాడున్ గను వారి కిది నిజమానంబేది సర్వేశ్వరా! 79

పరమప్రీతిని యాత్మగౌరవము బోవన్ సత్కుమాయుక్తులై
అనుగున్ పాదములైనబట్టి ధనమున్ - ఆర్జింపనీ పొట్టకై
నరుడెవ్వారలనైన, భావమున నిన్ - ధ్యానింప డేప్రొద్దు, ము
ష్కరుడౌ యాతని బ్రోతువెట్లొ వరపే - శాజొచ్చె సర్వేశ్వరా

నిన్నే జేరగనేర్తు నెట్లో తెలుపన్-నీకేసుసాధ్యంబు, లే
రన్నా! వేరెవరేని చెప్ప, సమయం-బాసన్నమైయుండె, నా
కన్నన్ పార్థుడె భక్తుడా! పలుకులే-కష్టంబ! లే, లేచిరా
వన్నా! ధన్యునిగా నొనర్చు, తరిబో-వన్నీకు సర్వేశ్వరా. 81
పలికింతేన సుమాంజలీ ప్రకటన-వ్యాజాన నీనోట, హృ
త్కలికన్ బాయు, సుధోపమంబగువచోదానంబులన్ ప్రాజచే
కలుగున్ నీకు నభీష్టసిద్ధియగుచున్, కాంక్షింతు వింకేమినీ
తలపే పండె నటందు వేమొ,పరి, నే ధన్యుండ సర్వేశ్వరా.
ప్రారబ్ధంబు నెదిర్చి నిల్చుటకు నాబ్రహ్మాదులున్ జాలరే?
దారిన్బోయిన భోగమే పలుపు తన్నాశంబు, భోగింపకే
పోరాదేరికి, సంచితంబు నశతున్-పోజూతునాగామి. న
న్గోరన్ అంతియ, యన్న నీ నిజమునే ఘోషింతు సర్వేశ్వరా
ప్రారబ్ధంబున లభ్యమైన సుఖమో-బంధంబొ భోగించు ని
స్సారంబైనది దేహమే, ఎపుడునే-శాంతుండ, సత్యుండ, నీ
శారీరంబగు దానిబొంద, నను లో స్పర్శించి, వీక్షించి నే
వేరై కోరెద నిల్వ నేనుగను నిర్వేదాన సర్వేశ్వరా. 84
తెలియున్ దేహ మనిత్యమంచు, నెపుడో-దీనిన్ విసర్జించి నా
నెలవున్ జేరుదునంచు నేను మమతల్-నేర్వన్ త్యజింపంగని
ష్ఫలమై పోవుచునుండె కాలముమనో భ్రాంతిన్ నిలన్ నేనుగా
బలమిమ్మా, వలదేది, నేసగుచు నిల్వంజూడు సర్వేశ్వర -85
స్థిరతన్ మానస మొక్కచో నిలదు విచ్ఛేయున్ సదా యేడకో
అరినాశా నిను భజింప నిదియ -న్యాసక్తమైయుండు, నే

శరణిన్ నీ జపపూజనాదికములే - గావింతు? దుర్నిగ్రహం
బుర నీభక్తిని దీనిగట్టి దపరిభూ - పోనీక సర్వేశ్వరా. 86
నవనీతంబుకన్న నీదుమనము - న్నా యెంతో లాలిత్యమై
భవపాశంబులగుందు నన్ను కరుణన్ - బ్రోవ్వై సదారక్ష సే
యు, విశాలంబగు దానియందునకదా! - యోచింతు నిల్వంగనీ
వవురా నిల్వర నాదుచిత్తమున ని - త్యంబింక సర్వేశ్వరా! 87
భగవద్గీత బఠింతు. రామచరిత - వ్యాసంగమే జేతు. నీ
దగు మంత్రంబు జపింతు. నిన్ గొలతు ని - త్యంబాభిషేకాదులన్
దగులన్ జేయుదు నీవయిన్ మనను నై - నన్ జేగ! పలయ్య నీ
నగుమోమున్ గనజేయ వొక్క - త్రృటినైనన్ దేవ సర్వేశ్వరా.
నేగన్నించిసయంత గోరుదువు, యెన్నెవింత నాక్షోగ్ర -, తే
లాగయ్యా! విను నా యెనాకనను. మీ రాయంనుగ్రాహింపు నీ
శ్రీగంధాంకిత పాదసేవ యొకటే - చిచ్ఛాంతి దంబంను, రా
రా! గన్పింపర. సమ్ముఖంబున నిలన్ - రావయ్య సర్వేశ్వరా!
ఏరూపంబు స్మరించుగాంచ పలుకన్ - మీ దేహయాత్రాంత
మం
దారా! అయ్య దెపాప్తసా నను దు, ర - క్లైవన్ భవద్రూపమే
తేగా, కల్పిమటన్ కనుంగొనుమ సూర్యాప్తిన్ దానవుల్యుండనై
చేరన్ వచ్చెద నీవుగాగ తనువున్ భేదించి సర్వేశ్వరా! 90
చూడజ్జూడ జగంబునెల్ల నతిగా చోద్యంబులైదోచు, నే
వాడున్ గాంచదు శాంతి, స్వాంతమున నా - స్వాదింపనానందమే
నాడున్ గోరదు, తానహర్నిశలు నిద్రిన్ వేదనొందు మన్
[illegible] విందియు సదా - దాసాన సర్వేశ్వరా!

ఎవరేమందురొ, [illegible]దు[illegible]యే నేలాగు పూజింతు, నా
కవమానది సంఘ[illegible]తారయ్యా! విశేషించి లా
ఘవత[illegible]దురంత ఛాందసునిగా కాకున్న నిన్గొల్వనే!
తవిలెన్ నీపయి నామనంబు, నిను నే ధ్యానింతు సర్వేశ్వరా.

ఫలముల్ పూపులు ధూపదీపములగూర్పన్ లేదు విత్తంబు, నీ
తలపే నామదినిల్పి హృత్సుమములన్ - తాదాత్మ్యచిత్తంబుతో
గొలతున్ మానసమందు నీవెరుగవా! - కూర్మిన్ భవద్భక్తియే
కల్గన్ జేయుమయా, చేతు నీకిదె నమస్కారంబు సర్వేశ్వరా. 93

[illegible]డు వాడు మీదయినవయ్యగ్గల్ సదాకీర్తిందుగా
[illegible]పజ్జను నిజ - ప్రావీణ్యమున్ బాసి, యే
[illegible]పనరంబు దక్కదు, దురాక్రాంతంబు నోమంచి, నీ
కడ నేనేదియు గోరకేనుగను నిక్కంబుందు సర్వేశ్వరా. 94

తరమే నిశ్చలభక్తి భావమున నిన్ధ్యానించు ఔచార్యకిన్
దరియన్ గాలుడు, సంతతాభ్యసనతన్ - తండ్రీ! సుసాధ్యంబిదా
స్మరియింతున్ నినుసర్వకాలము విరామంబేనుకోరున్ ప్రభా
కరకోటి ప్రభవెల్గు నిన్ననుదు నిక్కంబయ్య! సర్వేశ్వరా 95

పరమాత్మా పరుజేరి దీనతను నా - పాపీవెగా నెంచి, దు
ష్కరమౌ తత్పదమంటి యెత్తి, తుది లజ్జన్ వీడి, నిర్జీవియై
కరమున్ చాపి, వివేకమేది యడుగున్ - కాసుల్ సదాపాట్లకై
తెరవేదీగనడాత్మ నిన్నరుగనా - దీనుండ సర్వేశ్వరా. 96

అరిషడ్వర్గము లాత్మసంస్థితుడుగా - నాటంకమంచున్ నిరా
దరణాసన నియమించి, మానసము నీ ధ్యానములో మగ్నమై

తిరుగన్ లభ్యము కానిదేదికనుపే - క్షింపనేలా! త్వదా
దరణంబందగవచ్చు, నిన్ననగనౌ - తథ్యంబు సర్వేశ్వరా! 97
శివరూపంబున పూజసేయ శివుగా . చిత్తంబులో నట్టి రూ
పవలోకించి భజింతురట్టి వపుతన్-భాసిల్లచున్నచ్చి నీ
యవతారంబునుచూపుదుయ్యా! ఇకలేదయ్యా భయంబంతలో
నెవరో త్వాదృశులేరి? లేరనికదా నేనందు సర్వేశ్వరా! 98
కలవారిన్గని యట్టులే నగుటకున్- కాంక్షింప, సౌఖ్యంబుగా
వలె, నీయంగదెయుంచు వేడను ప్రభూ!-పద్మాసనంబందు ని
శ్చలమైనట్టి సమాధి చేస్మరచి నిష్కా-మ్యుండనై యాత్మలో
నిలువన్ జూడు, మరేమి కోరనిది సిద్ధింపంగ సర్వేశ్వరా! 99
పదియున్తొమ్మిదినందలాపయి నిడెబై నూడుకై స్వాబ్దమం
దిది నేజేసితి జ్యేష్టపూర్ణిమ ప్రమాదీచన్ భనచ్చింత నా
స్పదమై చిత్తమెలర్ప నేర్చుగతి నశాంతంబు విశాంతి నా
హృది నీవుండగ సర్వమున్ మరని, నిన్నే దల్చి సర్వేశ్వరా!
ధరణిన్ నేను సరస్వతీసులుడ, త్వద్ధ్యానంబె జీవంబుగా
మరతున్సర్వము, సోమనాహ్వయుడ, బ్రహ్మంబీవ సర్వంబుగా
నరయన్ జాలుదు నిన్ను, నన్యమది యేనాడున్ కనన్లేదు, నా
తెరగే యీస్థితి, సుస్థిరత్వమిడి న-న్దీవించు సర్వేశ్వరా. 101

ఓ మ్ త త్స త్,

# ఆనందాశ్రమ-అముద్రిత గ్రంధములు

1. శ్రీవిశ్వనాధశతకము 2. సూక్తిముక్తావళి 3. శ్రీ లక్ష్మీనృసింహ స్తోత్రము ( శంకరకృత కరావలంబనస్తోత్రమునకు గీత పద్యములు) 4. శ్రీహరినుతి 5. దండకరత్నములు 6. భగవత్ స్తోత్రములు 10. కలసూరగంప ఖండకావ్యసంపుటి) 8. భజనకీర్తనలు 9. లేఖావళి 10. శ్రీలింగశతకము (కందములలో) 11. కుమారప్రబోధము (కందములలో) 12. సూక్తిరత్నావళి (ఆటవెలదులలో వేమనపద్యముల మాదిరి) 13. శ్రీవినాయక శతకము (తోటకవృత్తములలో) 14. శివగీత (పద్మపురాణాంతర్గత శివగీత సరళపద్యానువాదం 15. మహాపురుషప్రవచనసుధామహోదధి(ఇస్లాము ప్రవక్త మహమ్మదు, శంకరాచార్య, రామకృష్ణపరమహంస, శ్రీరామతీర్థస్వామి-వీరి ప్రవచనములు కొన్ని పద్యములలో)17.శ్రీమదాంధ్రఅధ్యాత్మ రామాయణము (నిర్వచనము) 17. భగవద్గీతామాహాత్మ్యము (వరాహపురాణాంతర్గతగీతామాహాత్మ్యమునకు విపులమగు వ్యాఖ్య)

ముద్రణ పూర్తి కాబడిన గ్రంథములు

1. శ్రీగీతాతత్త్వము (భగవద్గీత గీతపద్యములలో )2.శ్రీశంకర శతకము 3. శ్రీశంకర శతకము(శివానందలహరి నాధారముగా 4. శ్రీ వెంకటేశ్వర శతకము ( చంపకోత్పల మాలావృత్తములలో )5 శ్రీసర్వేశ్వరశతకము(మత్తేభ శార్దూలవృత్తములలో

భక్తి, యుక్తి, ముక్తి పదములగువీనిని భక్తాగ్రగణ్యులగు వదాన్యులు తమ సహాయసంపత్తి నొసరగి ముద్రింపించి భగవదనుగ్రహమునకు పాత్రులై తాముతరించి, పెద్దలను తరింపజేయుదురని ప్రార్థించుచున్నాను. ఇట్లు,— రచయిత